# వేదాంతం

## (వ్యాససంపుటి)



mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

Like us to follow
@mohanpublications

# వేదాంతం

(వ్యాసాలు)



రచన

జి.యస్. ప్రకాశరావు

ప్రారంభించాక గర్భంలో ఉన్నప్పుడు గర్భంలోంచి ఎపుడుబయట పడుతామో అన్న ఆదుర్దా, చిన్న పిల్లాడుగా ఉన్నపుడు అశక్తతతో బాధపడి, ఎపుడు పెద్దాడి నవుతానో ఎప్పుడు నాకాళ్ళమీద నిలబడతానా అని ఆందోళన, పెద్దవారైన తర్వాత చావుకోసం ఆందోళన మామూలే జీవితములో ఎటు చూసినా సమస్యలే. ఈ సమస్యల పరిష్కారానికి తోటి మానవుల సహకారము దాని వలన కూడా సమస్యలు పరిష్కరించబడకపోతే భగవంతుని సహాయము కావాలి. భగవంతుడు తన సహాయాన్ని మనుష్యుల ద్వారాగానీ సంఘటనల ద్వారాగానీ కలుగ చేస్తుంటాడు, జీవితముతో ఒడుదుడుకులు వచ్చినపుడు గానీ, జీవితాంతములో గానీ భగవంతుని ఆశ్రయించక తప్పదు.

## సంఘము

మనిషి ఇతరుల మీద ఆధారపడక తప్పదు. మంగలి, చాకలి, పని మనిషి — చెప్పులు కుట్టేవాడు, బట్టలు కుట్టేవాడు, వీళ్ళ ఋణము తీర్చుకోలేము. మనిషి ఒక్కడూ అరణ్యములో ఉంటే అతనికేమీ నిబంధనలు లేవు.

మనిషి సంఘజీవి. తల్లి తండ్రి, అన్నలు తమ్ముళ్లు, అక్కలు, చెల్లెళ్ళు వీళ్ళతోపాటు మిగిలిన బంధువులు స్నేహితులు వీళ్ళుకూడా మనిషి చుట్టూ ఉండేవాళ్ళే. సంఘమంటే సంఘటితమయిన మనుష్యులు తేళ్ళకూ, చీమలకూ, తేనెటీగలకు ఉన్నట్టే ఒక పరిపాలనా వ్యవస్థ నియమాలూ ఉంటాయి. మనిషికి లిఖితపూర్వకమయిన నియమాల లాగే, నోటి మాట చెల్లుబడి అయ్యే నియామాలు కూడా ఉంటాయి. లిఖిత నియమాలు ఉల్లంఘించవచ్చునుగానీ సాంప్రదాయాలు ఉల్లంఘిస్తే సంఘం వెలివేస్తుంది.

ముందు ఈ నియమాలు శాస్త్రాలననుసరించి ఉండేవి. కాలక్రమేణా

ఇవి సాంప్రదాయాలుగా మారి మనిషిని కనుపించని సంకెళ్ళతో కట్టి వేశాయి.

## భగవద్గీత

మనిషికి తన పరిస్థితులలో ఒక్కొక్కప్పుడు సందేహము కలుగుతుంది. అర్జునుడికి కలిగిన సందేహము తరువాత ధర్మరాజుకి కలిగిన పశ్చాత్తాపము, రాజ్యకాంక్షతో బంధువులను, గురువులను. పితరులని చంపి రక్తసిక్తమయిన రుధిరాన్నమును భుజించడం ఎందుకు అని. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునకు కర్తవ్యము బోధిస్తాడు. ధర్మమును మరిచి పోకూడదు. కర్తవ్యము ఎప్పుడూ విస్మరించకూడదని. మనుష్యులు ఎప్పుడూ స్వధర్మము కష్టమైనా ఆచరించాలి. ఇంకొకళ్ళ ధర్మమును లాభసాటి అయినా ఆచరించకూడదు. ఈ శరీరము మనది కాదు ఆత్మ వుంది. ఆ ఆత్మకు శరీరము చేసే పనులు అంటవు. మనిషి గుణాలని బట్టి వ్యవహరిస్తాడు. భగవంతుడు మనుష్యులను మాయచేత యంత్రములో తిప్పినట్టు త్రిప్పుతాడు. మనిషిలో ఉన్న సహజమయిన ప్రకృతి మనిషిచేత అన్ని పన్లు చేయిస్తూ ఉంటుంది. మనిషి ఏ పనిని చేద్దాము, ఏ పనిని మానుదాము అని అనుకున్నా తన సహజమైన స్వభావము ఏదయితే వుంటుందో దానివలననే కట్టుబడుతాడు గుణాల చేత ప్రేరేపించబడి పనులన్నీ చెయ్యవలసిందేగాని, తన స్వంత ఆలోచనల చేత, స్వంత బుద్ధిచేత గుణాలకు వ్యతిరేకంగా పనులు చెయ్యలేడు.

భగవంతుణ్ణి నమ్ముకుంటే సంసారసాగరం తరించవచ్చు.

## భగవంతునికి ఒక ఉత్తరం

ప్రియమైన భగవంతుడా!

నీ కరుణ నాపై రానిమ్ము. జీవితము దుఃఖభరితమయినది. ఎటు చూసినా సమస్యలే ఏ పనీ అవదు. ప్రతి దానికీ అడ్డంకులే. నాకు శక్తి సామర్థ్యములు లేవు. ఒక సమస్య తల ఎత్తగానే చెయ్యవలసినంత చేసి, చేతులెత్తి నిన్ను ప్రార్థించగానే నాకు ఆ సమస్య తీరుతుంది. మళ్ళీ ఇంకో సమస్య రాగానే అదే భాగవతము. ఈ జీవితంలో సమస్యలకి విసిగి వేసారుతున్నాను. స్వామీ. పుట్టేటప్పుడే అనుకొన్నాను. ఈ దుఃఖభరితమయిన మనుష్య జన్మ ఎందుకు ఎత్తుతున్నాను అని? నాకేమీ అవసరం లేదే? నన్ను పుట్టించడం! చిన్నప్పుడు నా అశక్తతకు బాధపడి, నా కాళ్ళమీద నేను ఎట్లాగ నిలబడగలను అని అనుకొన్నాను. యవ్వనము వచ్చింది. నా జీవితము నేను నడుపుకొగల శక్తివచ్చింది. అప్పుడూ ఇప్పుడూ సమస్యలే. ఈ సమస్యలతో నేను సతమతమవుతున్నాను. జీవితము దుర్భరముగా ఉంది నన్ను నీలో చేర్చుకో.

## జీవితము

జీవితము జీవితము మీద ఆధారపడి ఉంటుంది. లక్షాధికారి అయిన లవణమన్న మే తింటాడు కాని మేలిమి బంగారం మింగబోడు. నూటికి 90 మందికి ఈ వేళ భోజనము ఎట్లా సమకూరుతుందా అనేదే ప్రశ్న.

ధనము తోటే ఉంది ప్రపంచమంతా. అంత మాత్రాన ఒక్క డబ్బుతోనే అన్ని వస్తాయనుకోడం పొరబాటు. జీవితంలో తిండి, బట్ట, ఇల్లు, వీటికంటే కొంచెం ఎక్కువ డబ్బు ఉంటే చాలు డబ్బు ఉన్నవాడికి లోకాన్ని గూర్చి ఆలోచన డబ్బు ఇంకొకళ్ళకి ఇవ్వవలసి వస్తుందేమోనన్న బాధ. కూర్చుని తింటే కొండలయినా కరుగుతాయి. జీవితానికి డబ్బుతో కావలసింది ప్రేమ. ఆదరణ, సుఖముగా కొనసాగితే చాలు.

మరీ బీదవాడు కాకుండా మరీ ధనవంతుడు కాకుండా మధ్యలో ఉండడం మంచిది. జీవితానికి ఫలితము భగవంతుని స్మరణ, మానవ జన్మ ఎత్తినందుకు మనము భగవంతునితో లీనమైతే అంతే చాలు.

## కఠోపనిషత్

శరీరాన్ని ప్రాణము వదిలాక ఏమైనా మిగులుతుందా? ఈ ప్రాణము ఎక్కడికి వెడుతుంది? శరీరము ఉండగా చేసిన పనులు వాటి ఫలితాలు ఏమవుతాయి? ఈ ప్రశ్నలకు జవాబు లిచ్చేది కఠోప నిషత్తు శరీరము శాశ్వతముకాదు. ప్రాణము ఆత్మకాదు. శరీరములో ఒక భాగాన్ని ప్రాణము వదిలేస్తే లేదా శరీరము వదలిపోవడము సంభవిస్తుందిగానీ మిగతా భాగాలకు సాధారణముగా ప్రాణము పోదు. కొన్ని ప్రదేశాలను హృదయము అట్లాంటి వాటిని ప్రాణము వదిలేసినప్పుడు శరీరాన్నంతటినుంచీ ప్రాణముపోతుంది. అందుచేత ప్రాణము భౌతికము అంతకు మించినది ఆత్మ ఆత్మ శాశ్వతముకాదు. ప్రాణము ఉన్నదీ లేనిదీ అన్నదానిమీద ఈ ఆత్మ ఆధారపడదు. ఆత్మ పరమాత్మ స్వరూపము, ఆత్మ ప్రాణము ఒకటి కావు, ఆత్మ శరీరములో ఉన్నపుడు తను భగవంతుడి నుంచీ ప్రపంచమునుంచీ వేరనుకుంటుంది, ప్రాణము శరీరమునించి పోగానే ఆత్మకు తెలుస్తుంది తాను శరీరము ఒకటికాదు, తాను పరమాత్మ స్వరూపము అవి భౌతికము కాదు అని.

ఆత్మను మనస్సు చేసేవనులు అంటవు. ఇంద్రియాలను నిగ్రహించి, పరమాత్మను ఉద్దేశించి జీవనము గడపాలి. ధనముగానీ యశస్సుగానీ శాశ్వతముకావు. ఆత్మ ఒక్కటే శాశ్వతము అది పరమాత్మ స్వరూపము.

## సెక్సు

జీవితాన్ని ఉద్రూతభూగించే శక్తిగలది సెక్సు (Sex) సినిమా

లలోగాని, పుస్తకాలలోగాని తలపులలోగాని భావపరంపరలోగానీ ప్రకృతి సిద్ధమైన ఆచరణలోగాని నూటికి నూరు పాళ్లు మంచి శక్తి వంతమైనది సెక్సు.

సెక్సు అన్నది పకృతి తననుతాను మళ్ళీ సృజింప చేసుకునీ, చేసుకోవడానికి ఉపయోగించే శక్తి. పుట్టినవాడికి చావుతప్పదు. ప్రపంచం లో సృష్టి సృజించుకోవాలంటే మనుష్యులకు ఒకళ్ళంటే ఇంకొకళ్ళకి ఆకర్షణ కలగడం అవసరము.

(జీవితములో పెళ్ళి అంటే సెక్సుని క్రమబద్ధం చెయ్యడము) చిన్నప్పుడు. మనుష్యులకు వుండే ఆకర్షణ వయస్సు మీరినకొద్దీఉండదు వయస్సు మీరాక భార్యాభర్తలకు ఒకళ్ళంటే ఇంకోకళ్ళకు శారీరక వ్యామోహము తగ్గి స్నేహము ఏర్పడుతుంది. వయస్సులో ఉన్నప్పుడు పిల్లల్ని కనడము, పెంచడము ఒకళ్ళంటే ఇంకొకళ్ళకు ఆకర్షణ కలగడము సృష్టి తన్నుతాను పునః సృష్టించుకోవడాన్ని సెక్సు అంటారు.

## మోక్షం

"బంధం మోక్షంచయోవేత్తి బుద్ధిస్సా పార్థ సాత్వికే" మోక్షము బంధము ఎవళ్ళయితే తెలుసుకుంటారో వాళ్ళే నిజమైన జ్ఞానులు. మనము ఈ పంజరము లాంటి శరీరములో ఉండి శరీరమే మనది ఇది నా భార్య వీళ్లు నా బిడ్డలు. ఈ భవబంధాలు నిత్యము నేను చూసేది వినేదీ చేసేది నిత్యము అనుభవించేది నిజము. వీళ్లు నాకు బంధువులు అని అనిపించి నంతవరకు బంధము తప్పదు ఈ బంధమునుంచి వెలువడడమే మోక్షము.

ఈ శరీరముతో నేను పుట్టలేదు చిన్నప్పుడు తల్లి గర్భముతో ఉండి తర్వాత శరీరము మనస్సు మార్పు చెంది, ఈ ప్రస్తుతపు శరీ

రము మనకు వచ్చింది. ఇదికూడా మిగలదు. ఈ శరీరము ఉన్నంత వరకే. శరీరము పోయాక వాళ్ళెవరూ మనతో రారు. ఈ నామరూపములు, కీర్తిప్రతిష్టలు సంఘములో స్థానము, ధనమూ ఇవన్నీ క్షణభంగురములు నేను అవి మనిషిఅనుకునేది. శరీరానికిసంబంధించకుండా పరమాత్మకు సంబంధించినది ఆత్మ అను జ్ఞానము కలుగడమేమోక్షము.

## స్వేచ్ఛ

ఎవరికీ ఇంకొకళ్ళని శాసించే హక్కు లేదు. ఎవరి మటుకు వాళ్ళే స్వతంత్రులు. అంత మాత్రాన ఒకళ్ళు ఇంకొకళ్ళ వ్యవహారంలో జోక్యము కలుగచేసుకునే హక్కులేదు.

స్వేచ్ఛ మనిషి జన్మ హక్కు స్వేచ్ఛ స్వాతంత్ర్యము వుంటేనే మనిషి పురోగమించగలడు.

స్వేచ్ఛని దుర్వినియోగము చేసుకోకూడదు, మిగిలిన వాళ్ళ స్వేచ్ఛని భంగపరిచే ప్రయత్నించే హక్కు ఏ మనిషికీలేదు. మనిషి స్వతంత్రుడిగా పుట్టాడు, కనేంతవరకే బిడ్డ తల్లికి తండ్రికీ ఆధీనముగా ఉంటాడు. బిడ్డ తల్లి నించి విడిపోయాక స్వాతంత్ర్యము వస్తుంది.

కన్నవాళ్ళకి పిల్లల్ని కన్నాక వాళ్ళు వాళ్ళ కాళ్ళ మీద నిలబడే వరకే బాధ్యత ఉంటుంది. ఆ తర్వాత ఎవరికివారే—యమునా తీరే; బాధ్యత మనిషికి మొగాడైతే 21 ఏళ్ళదాకా ఆడపిల్లయితే 18 ఏళ్ళదాకా ఉంటుంది. కొడుకు చదువు కూతురు పెళ్ళిఅయ్యేంతాకానే తల్లి తండ్రుల బాధ్యత వుంటుంది. ఆ తర్వాత లేదు. సంఘములో ఉన్నన్నాళ్ళు మిగిలిన వాళ్ళు రాసిన రూల్సు (Rules) వర్తిస్తాయి.

## భక్తి

నామరూపాలు తెలియని భగవంతుని ఆరాధించడానికి నామరూపాలున్న విగ్రహాలను ఆరాధిస్తున్నాము. తల్లి తండ్రి వీళ్ళని ఆరాధించినట్లే మన జన్మకు కారకుడైన భగవంతుని ఆరాధిస్తున్నాము. మన ప్రకృతి వీటి పుట్టుకకి కారణమై మన జీవితానికి మనుగడకు ఆలవాలమైన భగవంతుని ఆరాధిస్తున్నాము భగవంతుడు లేనిచోటు అంటూ లేదు. అంతా తనే అయి సర్వాంతర్యామిగా ఉన్న భగవంతుని ప్రత్యేకముగా ఆలయాలలోనూ, చర్చిలలోనూ మశీదులలోనూ సామూహికంగా భగవంతుణ్ణి ఆరాధిస్తున్నాము.

భక్తిలేని జీవితము వ్యర్థము.

(భగవంతుణ్ణి కాదనడము తల్లి పాలు తాగుతూ తల్లి రొమ్ము ల్ని గుద్దడము లాంటిది.)

భక్తి భగవంతుని వరము, భక్తిశ్రద్ధలేని జీవితము వ్యర్థము మానవ జన్మకు సార్థకము భగవంతుని పూజించడము మనిషి జన్మ ఎత్తడానికి కారణము భగవంతునితో లేనమై పోవడానికి అవకాశము. భక్తి వుంటే భగవంతుడు అనుగ్రహిస్తాడు.

## మనిషి

మనిషి యొక్క గుణాలు మనిషికి ప్రేరేపించి మనిషిచేత పనులు చేయిస్తూ ఉంటాయి. సత్యగుణాలు మనిషికి శాంతం, నిదానం ప్రసాదిస్తుంది. రజోగుణము మనిషికి క్రోధము అహంకారము ఇస్తుంది. తమోగుణము మనిషికి నిద్ర, బద్ధకము కలిగిస్తాయి. ఈమూడుగుణాలు మనిషిలో తగుపాళ్ళలో ఉంటాయి. ఈ మూడు గుణాలు మనిషి చేత

ఏ సమస్యయైనా వచ్చినపుడు మనిషిచేత పనులు చేయిస్తూ ఉంటాయి. ఈ మూడు గుణాలకూ అతీతుడై గుణాలు తన చేత పని చేయిస్తున్నా యని తెలిసినవాడు విజ్ఞాని.

మనిషి సంఘ జీవి, తన గురించి, తన భార్య, పిల్లలు, బంధువులు, స్నేహితులు వీళ్ళను గురించి తాపత్రయపడుతూ ఉంటాడు.

మనిషి ఒక్కడూ ఉంటే ఏ బాధ్యతలు లేవు. మనిషి తనంతట తాను భక్తి కలిగి ఉంటే అది మనిషి యొక్క అదృష్టము. భక్తికూడా భగవంతుని ఆశీర్వాదమే?

మానవ జన్మ ఎత్తినందుకు అష్టకష్టాలు పడుతూ ఉన్నందుకు సార్థకము భగవంతుడు ఇచ్చే మోక్షమే.

## జ్ఞానము

భక్తి భగవంతుడు మనిషి కోరుకుంటే ఇచ్చేది. జ్ఞానము భగవంతుడి వరము. జ్ఞానము అంటే క్షణమైన ఈ ప్రపంచంలో, అక్షరమైనది భగవంతుడే అని తెలుసుకోవడము, జ్ఞానము అంటే ఉన్నదంతా భగవంతుడు అని తెలుసుకోవడము.

కనిపించడు వినిపించడు ఎవళ్ళతోటో తప్ప మాట్లాడడు, అట్లాంటి భగవంతుడు ఉన్నాడని ఊహించడము కష్టము.

భగవంతుడు ఎక్కడున్నాడో, ఎలా ఉన్నాడో ఎవళ్ళకి తెలియదు. వాచీ తయారు చేయడానికి వాచీ-మేకర్ ఉన్నట్లే ఈ ప్రపంచాన్ని తయారు చెయ్యడానికి భగవంతుడు ఉండాలి అని ఊహించగలము.

భగవంతుడు ప్రపంచాన్ని పుట్టిస్తాడు కాని భగవంతునికి పుట్టుక ఉండీ ఉండదు. క్షరమైన ప్రపంచానికి అక్షరమైన భగవంతుడి ఆధారము విశాలమైన విశ్వాన్ని, సూక్ష్మమైన భగవంతుడు ఆక్రమించి ఈ ప్రపంచాన్ని అధిగమించే వాడు భగవంతుడే.

అన్ని దిశలనూ ఆక్రమించి, అన్ని వేళలా ఉండేవాడు భగవంతుడే. సృష్టి రహస్యము తెలిసినవాడు సృష్టికర్తయైన భగవంతుడే.

## ముక్తి

ముక్తి కోరుకుంటే వస్తుంది. జీవితంలో ఒక్కసారయినా భగవంతుణ్ణి ఉద్దేశించి "దేముడా! నాకు ముక్తి కావాలి" అంటే భగవంతుడు మోక్షాన్ని ఇస్తాడు. భగవంతుడు తనకు కావల్సిన వాళ్ళని ఎన్నుకుంటాడు.

మనిషి జన్మ ఎత్తింది ఇన్ని కష్టాలు పడేది. భగవంతుని యందు భక్తిభావము కలిగి మోక్షము సంపాదించడానికి, ఇంకెవళ్ళకూ ఈ అర్హతలేదు. ముక్తి సంపాదించడానికి ఒక్క మానవుడే ఇన్ని దుఃఖాలు సహించేది మోక్షము కోసమే. మానవజన్మ సార్ధకం కలిగేది ముక్తి పొందినపుడే.

సదేహముక్తి, విదేహముక్తి కన్నా నయము. ఈ జన్మలోనే ఉన్నదంతా భగవంతుడు అని తెలుసుకోవడము సదేహముక్తి. సదేహముక్తి పొందేవాడు జటుడిలాగ ఉంటాడు. విదేహముక్తి కోరుకున్న వాళ్ళందరికీ వస్తుంది.

ప్రేమ పెళ్ళి ఒకటికాదు. పెళ్ళి చేసుకొన్నాక వెంటనే ప్రేమ రాదు, ప్రేమ కోసము చేసుకొన్న పెళ్ళిళ్ళు వివాహానంతరము ప్రేమ వివాహాలుగా ఉండవు. సాధారణముగా ప్రేమ పెళ్ళి అయ్యాకే మొద లవుతుంది. పెళ్ళి అయ్యాక సాధారణముగా ఇంట్లో అల్లర్లు వచ్చినా, మనుష్యులు విడిపోరు.

ముందరొచ్చిన చెవుల కంటె వెనకాల వచ్చిన కొమ్ములే వాడి. పెళ్ళి అయ్యేదాకా తల్లితండ్రులు ముఖ్యమైతే పెళ్ళి అయ్యాక భర్త, పిల్లలు ముఖ్యమవుతారు. భర్తను తల్లి తండ్రి అవమానిస్తే ఏ ఆడదీ ఊరుకోదు. పిల్ల తల్లితండ్రులు కూడా సాధారణముగా అల్లుళ్ళంటే అగ్గగలాడుతారు.

మనుష్యుల్లోనే కాదు జంతువులలో కూడా భార్యాభర్త అన్యోన్య ముగా ఉంటారు.

భగవంతుడు నిర్ణయిస్తాడు, ఫలానా, ఫలానా వాళ్ళకు పెళ్ళి జరగాలని.

పెళ్ళి అయిన తరువాత భార్యాభర్తలు వో పట్టాన విడిపోరు. అలా అని అందరూ దంపతులు సఖ్యముగా ఉంటారని అనుకోవడానికీ లేదు. విడాకులిచ్చిన వాళ్ళు ఆదపాదడపా ఉంటారు.

## ప్రవర్తన

ఒరులేని యొనరించే అప్రియము నరునికి. ఇంకొకళ్ళు ఏమీ చేసినా నిర్లిప్తతగా ఉండడము. సన్యాసి అడవుల్లో తపస్సు చేసుకుంటే దాని గురించి ఏమీ తప్పులేదు. కాని సంఘములో ఉన్నవాళ్ళకు కొన్ని

బాధ్యతలు ఉన్నాయి. తన ప్రవర్తనవల్ల మిగిలిన వాళ్ళకు హాని కలుగ కూడదు.

నొప్పించక, తానొవ్వక తప్పించుక తిరుగువాడు ధన్యుడు. ఇంకొకళ్ళ మనస్సుకు బాధ కలిగించకుండా ఉండడము ప్రథమ కర్తవ్యము. మాటలు చాలా ప్రమాదకరము. ఇనుము విరిగినా అతకవచ్చు గాని, మనస్సు విరిగితే అతకలేము. మన దుష్ప్రవర్తన అవతలవాడిని హాని చెయ్యడము కన్నా మనల్నే ఎక్కువ హాని చేస్తుంది. ఎవళ్ళకూ ఇంకొకళ్ళని హాని చెయ్యడానికి హక్కు లేదు.

అహింస, సత్యము, ధర్మము ఇవి గీటు రాళ్ళు మనిషి ప్రవర్తనకు తనకు మాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము. తన్ను తాను రక్షించుకోలేని వాడు తన బంధువుల్నీ, సంఘాన్ని ఏమి రక్షిస్తాడు? అలాగ ద్వేషతఃకృతము సమదృష్టితో ప్రవర్తించాలి.

## భగవంతునికి ఒక ఉత్తరము

భగవంతుడా!

నేను నిన్ను కోరాను భక్తినివ్వమని. అది ఇచ్చావు. అదే కాక, జ్ఞానము కూడా ఇచ్చావు. అలాగా మోక్షం కూడా ఇయ్యి.

మనుష్యులతో కలిసి బతకడము చాలా కష్టము. ప్రతి మనిషి ప్రతిదానినీ, బోల్డంత రాద్ధాంతము చేస్తాడు. పీకుతాడు. ప్రతి విషయము సవ్యముగా జరగదు. ప్రతిదానికీ పీకులాట. ఒక సమస్య అయిందంటే ఇంకో సమస్య మొదలవుతుంది. ఏ పనయినా సుహృద్భావముతో చేసేది చాలా యాతన పడవలసి వస్తోంది. చస్తే కావ్యం

డును అనిపిస్తోంది. ఇంక యాతనపడే ఓపిక లేదు. ప్రతిదానికీ పీకులాటే ప్రతిదానికీ ఘర్షణే. ఈ సమస్యలతో వేగిపోతున్నాను. జీవితంలో పెద్ద కష్టాలేమీ లేవుగానీ, మొత్తం మీద వైరాగ్యం వచ్చేసింది. ఇంకను సమయము చెయ్యలేను. వోపిక చచ్చిపోయింది. చావాలని ఉంది. ఎప్పుడు వస్తుందా చావు అని ఎదురు చూస్తున్నాను. నివసించిన ప్రతి క్షణము మర్షణా, ఆందోళనా.

## కర్మ

ఫలితాలను ఆశించి చేసేది కర్మ. భగవంతుడు ఆ కర్మ అనగా పని చేయడు. తప్పుడు పనులు వికర్మ. యోగి శుభాశుభాలకూ, రాగ ద్వేషాలకూ, లాభనష్టాలనూ బేరీజు వెయ్యకుండా పనులు చేస్తాడు. వచ్చిన ఫలితం ఎలాంటిదైనా చలించకుండా ఉంటాడు.

పని చెయ్యకుండా మానవుడు ఉండలేడు. కూర్చోవడమూ, నించోవడము, మాట్లాడడము, ఊపిరి పీల్చడము, నడవడము, ఇట్లాంటి పనులన్ని ఏ మనిషి అయినా చెయ్యకుండా ఉండడు. ఫలితాన్ని ఆశించకుండా పనులు చెయ్యడము యోగి చేసే పని. తామరాకు మీది నీటి బొట్టులా, జీవితం సాగిండాలి జయమైనా, అపజయమైనా, పాటించకుండా, శక్తివంచన లేకుండా విద్యుక్త ధర్మాన్ని పాటించాలి.

తన ధర్మములో శక్తిలేక పోయినా, ఇంకోకళ్ళ ధర్మములో శక్తి ఉన్న తన గుణాలకు సరిపడ్డ ధర్మాన్ని ప్రతి మనిషీ ఆచరించాలి. కర్మయోగము అన్ని విధాలా మంచిది. ఫలాన్ని ఆశించి చేసే పను కలున్నా, ఫలాన్ని ఆశించకుండా చేసే పనులు ఉత్కృష్టము.

## కరుణ

అహింస, సత్యము, ఇవి దైవికమైన స్వభావాలు. దేవతలు రాక్షసులు, మనుష్యులు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి "మేము ఎలా ఉండాలి" అని అడుగుతారు. అప్పుడు బ్రహ్మ వారితో "దా, దా దా. అర్థమయిందా?" అని చెబుతాడు.

దానవులు దానిని కరుణతో బ్రతుకమని చెప్పాడు, అని కరుణతో బ్రతుకుతారు. దేవతలు దానిని నిగ్రహముతో బ్రతుకాలని అనుకుని నిగ్రహముతో బ్రతుకుతారు. మనుష్యులు దానిని మైత్రితో బతకమన్నాడు అనుకుని ఒకళ్ళతో ఒకళ్ళు స్నేహముగా ఉంటారు. ఈ రోజు కూడా ఉరిమినపుడు ప్రజాపతి "దా, దా, దా," అని మాటలతో గర్జిస్తు ఉంటాడు.

మనిషి అన్నాక తప్పు చెయ్యకుండా ఉండలేడు. రాజుకు శక్తి కన్నా శోభనిచ్చేది కరుణయే.

మనము ఎట్లాగ తోటి మనుష్యుల దగ్గరనుండి కరుణ నాశిస్తామో భగవంతుని దగ్గర కరుణ నాశిస్తామో అట్లాగే మనము కూడా. తోటి మనుష్యులన్నా జంతుజాలమైనా కరుణ కలిగి ఉండాలి.

## హిందూమతం

మతము ఏదయినా ఒకటే భగవంతుణ్ణి చేరే మార్గాన్ని చూపించే మార్గము మతము. చిత్త శుద్ధితో చేసే పనులు, ఎప్పటికి హాని కలిగించవు. మనిషి తినేది లవణ మన్నమే, లక్షాధికారి అయినాసరే. తిండి ఉన్నా, లేకపోయినా, డబ్బు ఉన్నా లేక పోయినా భక్తి అనేది కొంత,

మందికి దేవుడిచ్చే ప్రసాదము. కొద్దిమంది మాత్రమే దేవుడికి దగ్గరి మార్గము కోసము వెతుకుతారు. భగవంతుడి దయకు పాత్రులవు తేనే భక్తిని కోరుకుంటే భగవంతుడిస్తాడు. జ్ఞానము కోరుకోకుండా భగవంతుడిస్తాడు) జ్ఞానము భక్తికి జ్ఞానానికీ గమ్యము భగవంతుడే.

ఏ మతమైనా నమ్మకాలమీద ఆధారపడి ఉంటుంది. భగవంతుడెక్కడున్నాడు. చూపించు అంటే ఉన్న ప్రపంచాన్ని చూపించి ఇది అంతా భగవంతుడే అని చెప్పగలము.

వేదాలు హిందూ మతానికి ముఖ్యమైన వేదాలు, దేవుళ్ళకు పూజ చేసే విధానాన్ని చెబుతాయి. వేదాంతము హిందూమతములో భాగము కాకపోయినా, భగవంతుడొక్కడే అని చెబుతారు. భగవద్గీత కర్తవ్యాన్ని బోధిస్తుంది. హిందూమతము గురించి చెప్పదలిస్తే ఈ రెండూ ప్రామాణికాలు.

# ధర్మము

"అమ్మా! ధర్మము చేయ్యండి బాబు!" అని రోజూ బిచ్చగాళ్ళు వీధిలో, అడుక్కుంటూ ఉంటారు. ధర్మము అనేది దానముకు ప్రత్యామ్నయము ఇక్కడ. ధర్మమును నిలబెట్టడానికి ప్రతి అధర్మమును ఖండించడానికి ప్రతియుగములోను పుట్టుతాను, అని భగవంతుడు అన్నాడు. అధర్మము విద్యుక్తమూ తమ తమ గుణాలను గురించి చేసేది. ఇంకపోతే భగవంతుడన్నాడు స్వధర్మము లాభసాటి కాక పోయిన పరధర్మము లాభసాటి అయినా స్వధర్మము ఆచరించాలి

పరధర్మము భయావహము అన్నాడు. మనిషిని భగవంతుడు యంత్రములో కీలుబొమ్మలుగా తిప్పుతాడు. మనిషికి స్వాభావికమైన గుణాలు ప్రతి పరిస్థితులోను, మనుషులను ప్రేరేపించి వాళ్ళసహజమైన స్వభావముతో పనులు చేయిస్తారు.

ధర్మానికి మూలము భగవంతుడు. సంఘములో ప్రవర్తించేటపుడు నైతికముగ విలువలు కలిగి ఉండడము ధర్మము.

## కామము

మనిషి అయి పుట్టాక కోరికలంటు ఉంటాయి. ప్రతి మనిషికి ప్రధాన మంత్రి అవ్వాలని, తన కీర్తి దిగంతాలదాకా వ్యాపించాలని, బోలెడంత డబ్బు ఉండాలనీ ఉంటుంది. కోరికలు లేకపోవడము భగవంతుని దగ్గరకు చేరడానికి రాజమార్గము. ఈ ప్రపంచము ఇది ఇవ్వగలిగిన సుఖము పరీక్షించి, ఇదంత ఈ జీవితము ఉన్నప్పుడే ఈ పైన పనికి రాదు అనే ధృఢనిశ్చయంతో క్షణ భంగురమైన ఈ శరీరపు వాసనలను వదిలేది. శాశ్వితమైన పదార్థాలు భగవంతుడే అని తెలుసుకోవడము ఈ జన్మలో సాదిస్తే నివృత్తి ఉంది. లేకపోతే లేదు. పుట్టేటపుడు ఏమిలేదు చచ్చేటపుడు ఏమీలేదు. మధ్యలోనే వచ్చిన ఈ శరీరము దీనిబంధాలు మధ్యలోనే వదిలెయ్యగలగడము ఉత్తమము మళ్ళీ మరోజన్మలో ఏమిజరుగుతుందో ఎవరు చెప్పలేరు. ఈ జన్మములోనే మోక్షము సంపాదించాలంటే కోరికలను త్యజించడము అవసరము.

ప్రకృతి తల్లి పురుషుడు తండ్రి భగవంతుడు బీజాన్ని ప్రకృతిలో ఉంచితే. ప్రకృతి చరాచర జీవులను సృష్టిస్తుంది.

## తల్లి

ప్రకృతిలో క్షరము, అక్షరము ఉన్నాయి, ఒక్క క్షణమూ ఇంకో క్షణమూలా ఉండదు. ఎంత కవల పిల్లలైనా అచ్చము ఒకేలాగా ఉండరు. ఈ క్షణము ఉన్న ప్రకృతిలా మరో క్షణము ఉండదు. ప్రతి ఏడాది నిర్ణీతకాలాల్లో వసంతము, వానాకాలము, శీతాకాలము వచ్చినా, ఒక ఏడాదీ ఉన్నట్లూ ఇంకో ఏడాది ఉండదు. దృశ్య ప్రపంచములో మార్పు స్వాభావికము.

ప్రకృతి రూపాలు మార్చుకుంటూ ఉంటుంది. చెట్ల చాటునుండి వచ్చే ఆ సూర్యకిరణ పుంజాలు, సముద్రము పైనుంచి లేచే పూర్ణ చంద్రుడు బూరుగు దూదిచెట్టు పింజాలు పడుతూ ఉంటే, ఈ జన్మ ధన్యమైనదనిపిస్తుంది. క్షణిక ఆవేశములో తప్ప ఏ ప్రాణి ఎన్ని కష్టాలలో ఉన్నా చావాలని కోరుకోదు.

ప్రకృతి తన పిల్లల్ని తల్లిలా సంరక్షిస్తుంది. క్రమము రీతి తప్పవు.

ప్రకృతికి స్వాభావికమైన శక్తిలేదు. భగవంతుడు నిర్ణయిస్తాడు. మరుక్షణములో ఏమి జరగాలో భగవంతుని శాసనములో ప్రకృతి సృజించుకుంటు పోతుంది.

## మరణము

పుట్టిన మనిషికి మరణము తప్పదు. తల్లి గర్భములో ఉన్నప్పటి నుంచీ మరణము కాచుకు కూర్చుంటుంది. ప్రతి జీవికీ మరణము ఎప్పుడు పొంచే ఉంటుంది.

జీవించి ఉన్న వాడెవడూ చావునుకోరడు. ఎన్ని కష్టాలలో ఉన్నా ఎలాగో అలాగ జీవిస్తూ వుంటాడు. అంగవైకల్యం గానీ పిల్లలు తనకన్న చిన్నవాళ్ళు మరణించనీ చావునుకోరడు. మతి భ్రమించినా చావును కోరడు.

ఈ జీవితము మీద తీపి అర్థం చేసుకోలేము. మనిషి ఎలాగో అలాగ సర్దుకుపోతాడే తప్ప జీవితములో ఎన్ని పోరాటాలు వచ్చినా ఎంత అలసిపోయినా చావుమాత్రం కోరడు. కొందరు పునర్జన్మలో ఇంతకన్నా బాగా ఉండాలని కోరుకుంటారు.

ఆత్మహత్య చేసుకునేవాళ్ళు సాధారణముగా చిన్నచిన్న విషయాలకు చేసుకొంటారు. జీవితము దేవుని వరము. జీవితముమీద విరక్తి పుట్టడము అందరికీ కలుగదు.

## జీవితము

క్రీడా దస్త్యఖితంజగత్. ఈ ప్రపంచము భగవంతుడు ఆడుకోవడానికి సృష్టించబడింది. మనుష్యుల కలయిక వలన పిల్లలు పుడుతారు. ఆ పిల్లలు తప్పటడుగులువేస్తు ఉంటే తల్లిదండ్రులు ఆనందిస్తారు. స్నేహితులతో కలిసి సరదాగా సినిమాలకూ, షికార్లకువెళ్ళి ఆనందిస్తారు. స్నేహము చాల విలువైనది. స్వార్థము లెక్కలోనికి రాదు. స్నేహితుల దగ్గర ఎలాగైతే పిల్లలదగ్గర తమ స్వార్థము విడనాడుతారో అల్లాగే స్నేహితుల దగ్గర స్వార్థము విడనాడుతారు. తల్లిదండ్రి తాతముత్తాత

పీళ్ళవలనే మనిషికి ఆదర్శాలు ఏర్పడతాయి. స్నేహితుల దగ్గర అలవాట్లు ఏర్పడతాయి. ఈ అలవాట్లు మొట్టమొదట ఆనందంగానే ఉండి తరువాత వాటిని వదలి పెడుతారు. సిగరెట్లు కాలచడము బీరు తాగడము, పేకాట ఆడడము, ఇవన్ని ఒకసారి అలవాటు అయ్యాక మానవు. ముందర సరదాగానే అన్ని మొదలు పెడతారు. తరువాత ఇల్లు వల్లు గుల్ల అయినా ఇంక వాటిని మానరు.

భగవచ్ఛక్తి జీవితానికి ఆధారము. అది ఉంటే జీవితములో సంకటములు ఉండవు.

## శిక్ష

నేరము శిక్ష నేరము సంఘానికి సంబంధించినదైతే శిక్ష సంఘము విధిస్తుంది ఇది కారాగారవాసము దగ్గర్నుంచి, ఉరిశిక్ష దాకా మనుష్యుల శాసనాలననుసరించి ఉంటుంది. సంఘము మనిషి నేరము చేస్తే ఊరుకోదు. తప్పుపట్టేవరకు అందరు పెద్దమనుష్యులే. అలా అని శాసించే వాళ్ళు మాత్రము ప్రతి మనిషి పెద్దమనిషి అని ఋజువు అయ్యే దాకా దొంగగానే అనుమానిస్తారు. నేరము చెయ్యలేదు అని ఋజువు చెయ్యడము కష్టము. (నేరము ఫలానా మనిషి చేసాడు అని ఋజువు చేసాడు అని ఋజువు చెయ్యడము కన్న) ఈ పైన చెప్పింది శాసనాల ననుసరించి.

ఇవి కాక రాయని శాసనాలు సంఘములో ఎన్నో ఉన్నాయి. వీటిని వ్యతిరేకిస్తే సంఘములో శిక్షపడుతుంది. వెలి వెయ్యడముదాకా.

భగవంతుని శాసనాలు కొన్ని ఉన్నాయి. మనుష్యులు, జంతువులు, పశుపక్ష్యాదులు వాళ్ళ మీదే కాదు భగవంతుని శాసనాలు ఉంద

దము చరాచరజగత్తు అంతటి మీదా భగవంతుని శాసనాలు వర్తిస్తాయి. భగవంతుని శాసనాలు మనుష్యులు ఉల్లంఘిస్తే, వెంటనే దాని పరిణామము కనిపించకపోవచ్చు. న్యాయము ఆలస్యమైనా జరిగితీరుతుంది.

## వివాహము

ప్రకృతి తన్ను తాను సృజించుకుంటూ ఉంటుంది. ఏ చెట్టు అయినా ఆకురాలు కాలములో ఆకుల్ని వదిలి పెట్టేసి మళ్ళీ వసంతము రాగానే చిగురిస్తుంది. అల్లాగని మోడుపడిపోయిన చెట్లు లేవని కాదు. నిత్యము పచ్చగా ఉండే చెట్లు కూడా ఉన్నాయి.

మనిషి పుట్టినప్పుడు చాల చిన్న పిల్లవాడిలా పుడతాడు. తరువాత ఎదిగి 21 ఏళ్ళకు పూర్తి స్వరూపాన్ని చేరుకుంటాడు. అప్పటి నుండి పతనమై ఏ 50 ఏళ్ళకో 60 ఏళ్ళకో చస్తాడు. అలాగ ప్రకృతి చచ్చిపోయిన వాళ్ళ బదులు కొత్త జీవులను సృష్టిస్తూ ఉంటుంది.

సృష్టిక్రియ మనుష్యులలో ఒకళ్ళంటే ఇంకొకళ్ళకు వ్యామోహము సంభవించడముతో వస్తూంది.

ప్రపంచములో స్త్రీలు, పురుషులు సమానమైన పాళ్ళలో జన్మనిస్తారు. అందుకని ఒక మగాడికి, ఒక ఆడది, ప్రకృతి సృష్టికి అనుకూలముగా పెళ్ళయిన వాళ్ళకు సంరక్షణగా వివాహము అనేది సంస్థ సంఘము ఏర్పరించింది.

## మనిషి

మనిషి సంఘజీవి, సంఘానికి ఎంతో రుణపడి ఉంటాడు. మనిషి స్వయమ్ముగా ఏపని చేయ సమర్థుడుకాడు. 9నెలలు తల్లి గర్భంలో పెరిగి

బయటపడ్డ తర్వాత వయస్సు వచ్చేవరకు తల్లిదండ్రుల మీద ఆధార పడాలి. కాని మనిషి ఒక స్థితికి చేరుకున్న తర్వాత తనంతవాడు లేడన్న గర్వం పొందుతాడు. మనిషిని సృష్టించిన భగవంతుడు తన్ని మానవుడు మరువకూడదు అని ఉద్దేశించాడు. కాని సుఖదుఃఖాలలో మంచి చెడులను సమానంగా చూడలేని మానవుడు తనకంటూ ఒక న్యాయం ఏర్పరుచుకొని భగవంతుని మర్చిపోయాడు. మరణించడానికి పుట్టిన ఈ మనిషి తన కాలాన్ని కొంతయినా భగ వంతుని స్మరణకు వినియోగించగలగాలి. ఆత్మ సాక్షాత్కారం పొంద గలిగిన మానవుడు భగవంతునికి ప్రతీకగా అవుతాడు. మనిషి సంఘంలో జీవించినంతకాలం కొన్ని నియమాలకు కట్టుబడి ఉండాలి. ఇతరులకు హాని చేయకుండా వీలైతే మేలుచేస్తు పదిమందితో కలిసి బతకడం నేర్చుకోవాలి. మనిషికి సాటివ్యక్తిని చంపే హక్కులేదు. జీవితం భగవంతుడు ఇచ్చిన వరం అందరు బ్రతికే హక్కువుంది. తన శక్తిమీద నమ్మకం ఉన్నా ఇతరుల సహాయం తీసుకోనవలసి వస్తుంది. ఏదన్నా సమస్య వచ్చినప్పుడు దాన్ని అన్ని కోణాల్లోంచి పరిశీలించి ఇతరులకు హాని కలుగకుండా పరిష్కరించుకోవాలి.

## విశ్వము

సృష్టికి ముందు అంతా శూన్యము. భగవంతుడు చూస్తుండగానె అంతా జలమయం అయింది. దాంట్లోంచి సముద్రాలు ఏరుపడ్డాయి. వాటిని నీరు అని తలుస్తుండగానే నీటిలోంచి ఒక అండం బయటపడింది. అది భూగోళం అది బద్దలయింది. దాన్నుండి అన్ని రకాల శబ్దాలు వచ్చాయి. అవే జంతువుల పక్షుల అడుపులు. దాంట్లోంచి ఔషధుల చెట్లు వచ్చాయి. ఈ అండంయొక్క నోటిభాగం నుండి

మాటలు వినవచ్చాయి. ఆజోః అన్నట్టుగా ఉంది. అవే అన్ని పదాలకు మూలం. సృష్టి జరిగింది దాంతో ఆకలి దప్పిక వచ్చాయి. అవే సముద్రంతో భరించరానివిగా అయ్యాయి. తినడం ప్రారంభిస్తే చాల లేదు. ఆహారాన్ని మింగటం జరుగుతోంది. ఆకలికి తట్టుకోవడం సాధ్యమయ్యే పనికాదు.

## భగవంతుడు

భగవంతుడు విశ్వవ్యాప్తుడు. సృష్టిస్థితి లయకారుడు, విశ్వరూపుడు. అనేకమయిన ఆదియుగాలను తనలో నింపుకున్న కోటి సూర్య సమతేజుడు. భగవంతుని ఇచ్ఛవలననే ఈ సృష్టి జరుగుతోంది. చీమ మొదలుకొని మనిషి వరకు, అణువు మొదలు బ్రహ్మాండము వరకు అన్ని భగవంతుని వలననే తయారు అవుతున్నాయి.

ఈ విశ్వంలో కలిసి అన్ని తానుగా తనంతటతానుగా నిండిపోయాడు. భగవంతుడు ప్రతి జంతువుకూ ప్రతివారికీ ఒక న్యాయం ఏర్పాటుచేశాడు. తన ఆజ్ఞలేకుండా ఏపని జరగనివ్వడు. పంచభూతాలు భగవంతుని ఆజ్ఞకు లోబడి పనిచేస్తాయి. మనిషి ఎప్పుడు చిరంజీవి కాడు. భగవంతున్ని తెలుసుకోగలిగే వారు చాల తక్కువ. అలాగే భగవంతుని చేరగలిగేవారు కూడ కోటికి ఒకరు ఉండవచ్చు. వారే చిరంజీవులు, నేను మోక్షం పొందగోరుతున్నాను అనుకొనేవారు చాల తక్కువమంది ఉంటారు. కారణము జీవితేచ్ఛ మన చుట్టూ ఉన్న సమాజంలో మన బంధువులు దగ్గరివాళ్ళు అందరూ మరణించడం చూసి, మరణం తప్పదని తెలిసికూడా జీవి జీవించడానికి కోరుకుంటుంది. కారణం ఇహలోకంలో కనపడే సుఖాలు భగవద్ద్వేతంవల్ల లభించే

దమిటో తెలియకపోవడంవల్ల భగవంతుని చేరుకోవలసిన దారి సులభ మయినది కాదనుకోవడంవల్ల దారి తెలుసుకున్నవారు చాలా కొద్దిమంది వున్నారు. వారే ముముక్షువులు, భగవంతుడు ప్రేమామయుడు భక్తితో తనను కోరుకునే వారికివ్వదలుచుకున్నది తప్పక ఇస్తాడు. ప్రేమంటే ప్రకృతి తనయొక్క జీవరాసుల మీద చూంపిచేది. తల్లి బిడ్డ మీద చూపించేది తప్పుచేసిన బిడ్డని తల్లి క్షమించినట్లుగానే భగవంతుడు మానవుని తప్పులనుక్షమించి కాపాడుతాడు. మనుషుల్లో ప్రేమాభావం పరులకు సహాయపడేట్టు చేస్తుంది. భగవంతుడు తన ఒంటరితనం పోగొట్టుకోవడానికి స్త్రీని సృష్టించాడు. ఆమెతో కలిసి మనిషి మొదలగు సర్వ జీవరాసులను సృష్టించాడు.

## ఆత్మ

ఆత్మ భగవంతుని వివిధ రూపము కాదు. రెండూ ఒక్కటే. చెవి వినడానికైతే వినేది ఆత్మ. నాలుక రుచి చూడడానికైతే రుచి చూసేది ఆత్మ. చర్మము స్పర్శ కయితే, స్పర్శకలిగేది ఆత్మకు. నోరు మాట్లాడడానికి అయితే మాట్లడేది ఆత్మ చూసేదికళ్ళయితే చూసేది ఆత్మ.

ముందర ఉన్నది ఆత్మ. వెనుక నున్నది ఆత్మ. పైన ఉన్నది ఆత్మ. కింద ఉన్నది ఆత్మ లోపలి ఉన్నది ఆత్మ.

ఆత్మకు పరమాత్మకు తేడా లేదు. ఉన్నదంతా ఆత్మ, పరమాత్మ.

ఈ పనులను చేయించేవి శరీరము, మనస్సు, బుద్ధి ఆత్మకు కర్మ లుండవు.

చంపేవి చేతులైతే చంపబడేది శరీరము. చంపేది చచ్చేది ఆత్మ అనుకుంటే పొరపాటు

భగవంతుడు మనుష్యుల మీద యంత్రము మీద అమర్చబడ్డ కీలుబొమ్మలలా పని చేయిస్తాడు.

మనిషి యొక్క సహజమైన గుణాలతోటి ఆత్మ నంటకుండా మనస్సు శరీరము పనులను చేయిస్తాయి ఈ పనులు మనస్సుకూ శరీరానికీ చెందుతాయి గానీ ఆత్మకు చెందవు.

## జీవితము

ప్రకృతి, పురుషుల కలయిక వలన సృష్టి ఏర్పడుతుంది. మనిషికి గర్భములో ఉండగానే తెలివి వస్తూంది. చిన్నపిల్లవాడైనప్పుడు దేవభాష మాట్లాడుతాడు. కొంచము ఎదిగి చిన్న పిల్లవాడు అవగానే ఎప్పుడు పెద్దవాడిని అవుతాను ఎప్పుడు నా కాళ్ళ మీద నేను నిలబడతాను అని ఎదురుచూస్తూ ఉంటాడు. యౌవనము వచ్చి, చదువు పూర్తి అయి పెద్దవాడవగానే, జీవితములో చావులు అనుభవిస్తూ సమస్యలను ఎదుర్కొంటూ ఉంటాడు. ఇంక వయస్సు మళ్ళి బాధ్యతలను స్వీకరించాక ఎప్పుడు చస్తాను అని ఎదురు చూస్తాడు.

అన్ని జీవితాల్లో సాఫీగా జరిగిపోతే మంచిది. ఒక్కొక్కప్పుడు ఏమీ తోచక విసుకు పుట్టుతుంది అన్ని జీవితలలోను మద్వరికము మంచిది. జీవితానికి సార్ధకముతోటి మనుష్యులకు సాయం చెయ్యడం. భగవంతునికి సేవ చేయడములోను ఉంటుంది.

ఎక్కువ కాలము జీవించడం కాదు ముఖ్యము. ఆ జీవితము ఎల్లాగ ఉపయోగించాల అన్నది ముఖ్యము.

# ప్రేమ

మనిషికి భగవంతుడంటే భక్తి. సాధారణముగా భగవంతుని అనుగ్రహము వలన కలుగుతుంది. భగవంతుడంటే ఈ సకల చరాచర ప్రపంచము ఎవరి వలన సృజింపబడిందో ఎవరివలన నడపబడుతుందో ఎవనిలోన కలిగి ప్రతిక్షణము లీనమవుతోందో, అదే ఆ భగవంతుడి సృష్టి నాక్రమించి, నడుస్తోంది.

ప్రకృతి సృజించుకుంటూ పోతుంది. పెంచి పెద్దవాళ్ళను చేస్తుంది మళ్ళీ లయింప చేస్తుంది. తల్లి తండ్రులకు వాళ్ళ పిల్లలమీద ఎంత ప్రేమ భగవంతునికీ, ప్రకృతికి వాళ్ళ బిడ్డలమీద అంత ప్రేమ మనిషి భగవంతునిలో ఉన్నాడు. భగవంతుణ్ణి ప్రార్థిస్తే, భక్తి కలుగుతోంది. భగవంతుడు ఎవరైతే భక్తిని కోరుకుంటారో వాళ్ళకి భక్తినిస్తాడు. భగవంతుడు కోరుకోక పోయినా జ్ఞానము ఇస్తాడు. భక్తి ఒక్కటే ఈ కాలములో మోక్షము సంపాదించడానికి చాలు. చిన్నతప్పులుచేసినా, భగవంతుడు తనను ఆశ్రయించినచో క్షమిస్తాడు.

# ప్రకృతి

ప్రకృతి తల్లి, పురుషుడు తండ్రి ఈ ప్రపంచము శాశ్వతము. పురుషుడు, ప్రకృతి కలయిక వలన ఈ ప్రపంచము ఏర్పడింది. పురుషుడు ప్రకృతిలో బీజము ఉంచుతాడు. ప్రకృతి సృజిస్తుంది.

ప్రకృతి తల్లి. చరాచర జీవులను వాళ్ళు ఎంత వయస్సు వచ్చిన వారైనా కాపాడుతోంది. జీవులకు కావల్సింది ఆహారము.

ప్రకృతితోని జీవులు ప్రకృతిలోని జీవులను ఆహారముగా తీసుకుంటారు.

ప్రకృతి పురుషుడు నియమించిన ప్రకారము ప్రకృతి గర్భములో నున్న శిశువులనే కాక వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడేటంత వరకూ వాళ్ళను సంరక్షిస్తుంది.

ఈ ప్రపంచము ముందు కోడిగుడ్డులా సృష్టింపబడింది. అది రెండు చెక్కలై ఆకాశము ఒక భాగము, భూమి ఒక భాగము అయ్యాయి దిక్కులు చెట్లనుంచి ఏర్పడ్డాయి వినడము ఏర్పడింది చర్మముమీద వెంట్రుకలు చెట్టునుండి ఏర్పడ్డాయి. ఇవి వాటికో స్థావరము కావాలన్నాయి. అన్నింటిలో ఉత్తమమైనవి మనిషిని ఆక్రమించుకున్నాయి. ఆ శిశువుకు ఆకలివేసింది. అన్నింటిలోనూ ఆ ప్రాణ వాయువువలన తిండిని స్వీకరించ కలిగింది. ప్రపంచములోనున్న తిండి పురుషులదైనా, కుక్కలదైనా మనిషికి ఆహారము.

## కర్మ

ఏదైనా ఫలితాన్ని ఆశించి చేసే పనిని కర్మ అంటారు. భగవంతుడు ఏ పని చెయ్యడు. లేకపోతే అస్తమాను పని చేస్తూ ఉంటాడు. పెద్ద తనాన్ని వాటిల్ల వచ్చే దుష్ఫలితాల వల్లనే తెలుసుకోగలుగుతాడు.

మనిషి ఏదో పని చెయ్యకుండా ఎప్పుడూ ఉండలేడు. నడుస్తూ తిరుగుతూ, కూర్చుకుంటూ, పడుకుంటూ, నిద్రపోతూ, ఏదో విధమైన పని చేస్తూ ఉంటాడు.

కర్మ నిషిద్ధముకాదు. కాని కోరికలు పెట్టుకొని చేస్తే పనులు చెయ్యడము, తప్పు తన విద్యుక్త ధర్మాన్ని చెయ్యడము ఏ మాత్రము తప్పులేదు. తన ధర్మాన్ని బాగా ఆచరించకపోయినా చెయ్యడము తప్పు కాదు ఇంకొకళ్ళ ధర్మాన్ని బాగా ఆచరించినా చెయ్యడము తప్పు.

మనిషి యొక్క సహజమైన గుణాలు మనిషిని ప్రేరేపిస్తాయి. మనస్సు ఒప్పుకోక పోయినా గుణాలు మనిషిని కర్మను ప్రేరేపిస్తాయి.

కోరికలు లేకుండా పని చెయ్యడము ఉత్తమము.

## ముక్తి

జీవితములో కావలసినవి తిండి, బట్ట. నివసించడానికి ఒక స్థలము. ఇవి సమకూరక మనిషి భగవంతుని వైపు దృష్టిని మళ్ళిస్తాడు.

ఈ ప్రపంచము శరీరము ఉన్నన్నాళ్ళే ఉంటుంది. మనము ఎక్కడినుంచి వచ్చామో, ఎక్కడికి వెడుతున్నామో తెలియదు.

ప్రకృతి, పురుషుడు శాశ్వతమ్. అయినా ప్రకృతి పుట్టడము, ఎదగడము, నశించడము ఉంటాయి. ఇంతకన్నా నశించని పదార్థము ఒకటుంది. అదే ఆత్మ.

భగవంతుని మాయవలన ఆయననుండే ఈ స్పర్శ, రూప, రస గంధాలు ఉత్పన్నమయి, ఈ ప్రపంచము నిజము, అనిపిస్తుంది. ఈ ప్రపంచానికి అతీతమైనది ఏదో ఉందని అందరికీ తెలుసు, కాని జ్ఞాన చక్షువుకుతప్ప మామూలు కళ్ళలో కనబడని భగవంతుని గురించి తెలుసుకోవడము కష్టము. ఈ ఐహిక విషయాలతోటే ఉంది లోకము అనుకునేవాళ్ళే ఎక్కువ. ఈ తీత తొలగాలి భగవంతుని చూడాలి భగవంతునిలో చేరాలి అన్న భావం అందరికీ రావు. దీని కోసము ప్రపంచాన్ని వదిలేసి, మనుషుల జ్ఞానమార్గము ద్వారా పొంది భగవంతునిలో ఐక్యము ముక్తి.

# స్నేహము

మనుష్యునకూ, భగవంతునికీ స్నేహము ఎక్కువుంది. భగవంతుడు ఒక్కడూ ఉండలేడు. అందుకనే తనలోనుంచే ఈ ప్రపంచాన్ని సృష్టించాడు. ప్రకృతి క్షణికము ప్రతిక్షణము ప్రకృతి మారుతూ ఉంటుంది. భగవంతుడు మూలపురుషుడు మారడు.

ప్రకృతికున్న గుణము స్నేహము, సభ్యత. ఇవి రెండూ ప్రజలకు కూడా ఉన్నాయి. విశ్వము భగవంతునికి కనిపించే రూపము, భగవంతుడు అందరికీ స్నేహితుడే. భగవంతునికి చెయ్యవలసిన పని కాని, ఆశించవలసిన ఫలితముకాని లేదు. అయినా భగవంతుడు ప్రపంచములో కనిపించకుండా ఉన్నట్లయితే ఈ ప్రపంచము స్తంభించి పోతుంది. మనుష్యులకేమి కావాలో మనుష్యులకన్న భగవంతునికి ఎక్కువ తెలుసు. కష్టాలలో ఉన్న మనుష్యులు భగవంతుని ప్రార్థిస్తే భగవంతుడు సహాయము చేస్తాడు.

స్నేహము బంధుత్వము కన్నా ఎక్కువ. బంధువులు ఒకొక్కళ్ళకళ్ళకి చేసే సహాయం ప్రతిఫలము కోరకుండా చేస్తారు. ప్రతిఫలము ఆశించేది స్నేహము కాదు.

# మరణము

ప్రతిక్షణము సృష్టిస్థితి లయములు జరుగుతూనే ఉంటాయి. వీటిల్లో సృష్టి ఆనందదాయకము. స్థితి కావలసినది లయము తప్పనిది ఎంత యోగీశ్వరుడైనా కాలము ఆగగానే నశించవలసినదే.

మరి తనువు ప్రతిక్షణము ఆసన్నమవుతోంది. వాన రాకడ ప్రాణం పోకడ ఎవళ్ళను చెప్పలేరు ఎంత ధనవంతులైనా మృత్యువుకు లల్లి ఆవస్థమ్ము తప్పదు,

విధి రాసుకుంటూ పోతుంది దీనిని ఎవళ్ళు ఆపలేరు దీనిని మహారాజులు రాజ్యము చేసినచోట ఈవేళ నక్కలు రాజ్యము చేస్తున్నాయి. ఎడారిలో ఒక విగ్రహము ఉంది "నేను చూసిన దాని కంతటికి రాజును" అని చుట్టు ఇసక.

ఈ శరీరము మార్పుచెంది చివరకు లయము అవక తప్పదు. ఉన్నన్నాళ్ళు భగవంతుని స్మరించుకుంటూ ఉంటే దుఃఖ భరితమైన ఈ ప్రపంచములో మళ్ళీ మళ్ళీ పెరగడము మళ్ళీ సమస్య నెదుర్కొవడము ఉండదు. చావు వచ్చే ముందర భగవంతుని స్మరించుకుంటే భగవంతునిలో ఐక్యము అవుతాడు.

## భగవంతుడు

ఉన్నదంతా భగవంతుడే ఈ దృశ్యాదృశ్య ప్రపంచము అంతా క్షరము అక్షరమైనది మూలము భగవంతుదేభగవంతునికి నామరూపాలు లేవు. ఏరూపములేని భగవంతుడు ఉన్న బుద్ధికికానీ, స్పర్శకు కానీ అందనివాడు కాబట్టి భవంగతునకు నామయాపాలు ఏర్పరిచి భగవంతుని కూడా ఉత్తమోత్తమైన సృష్టి కనుక మనుష్య రూపములో ఊహించి కథలూ, కమామీషలు ఏర్పరిచి పూజిస్తుంది హిందూ మతము.

హిందూమతము కూడా వేదాంతములో చెబుతుంది భగవంతుడు ఒకడే అని ఇంద్రియాలు వస్తువులను ఉద్దేశించి స్పర్శ, రస గ్రంధాల అనుభవించేవి మనస్సు ఆత్మ (అంటే నేను అనుకునే పదార్థము) కార్యాలను చెయ్యము. కార్యాలుకాని, వాటి ఫలితాలుగానీ అంటవు ఆ

ఆత్మ పరమాత్మ స్వరూపము భగవంతుని మీద భక్తి ఉంటే ఈ ప్రకృతి నుంచి తరిస్తాము.

## ధ న ము

ధనమూల మిదం జగత్. డబ్బులేకుండా మర్త్యములు జీవించలేదు కష్టానికి ప్రతిఫలము డబ్బు దేనికైనా మతము ఉన్నట్లు డబ్బుకూడా మతంగానే ఉండాలి పిత్రార్జితము మీద బతకడము కన్న స్వశక్తి మీద బతకడము మంచిది డబ్బుంటే పనిచెయ్యబుద్ధి వెయ్యదు. ఎక్కువ డబ్బు ఉంటే విపరీతమైన బుద్ధులు పుడతాయి డబ్బుఉన్నంతమాత్రాన మోక్షమురాదు. డబ్బుంటే జీవితము సుఖమవుతుంది కానీ మోక్షదాయకము కాదు. డబ్బు శుభకార్యాలకు ఉపయోగిస్తేనే సద్వినియోగము అవుతుంది. డబ్బుంటే సంఘసేవ సులువు. డబ్బుండి తిండికి తడుము కోనక్కర లేకపోతె సంఘసేవ చెయ్యడము సులువు అవుతుంది.

డబ్బున్నంత మాత్రన సుఖపడతామనుకోవడము భ్రమ. డబ్బు లేని వాళ్ళకు డబ్బుంటే చావుండదని అనిపిస్తుంది. ఎక్కువ డబ్బుంటే బుద్ధి విపరీతమైన తలలువేస్తుంది. అహంకారము పెరుగుతుంది. నాకంటే గొప్ప వాళ్ళెవరు లేరనిపిస్తుంది.

డబ్బు కావలిసిన దానికన్న కొంచెము ఎక్కువ ఉండటము మంచిది.

## భ గ వ ం తు డు

భగవద్గీత ఏకాదశీ ధ్యాయములో భగవంతుని గురించి చెప్పబడింది. వివిధమైన కాళ్ళు, బళ్ళల, కాంతి ఆయుధాలు ధరించి ప్రపంచాన్ని కబళిస్తున్నట్లు భగవంతుని చూసినట్లు అర్జునుడు చెబుతాడు,

విశ్వమంతా ఆక్రమించి ఉన్నట్లు, సూర్యచంద్రులు కళ్ళుగాను, అగ్ని నోట్లో ఉన్నట్లు జీవులందరు ఆహారముగా ఉన్నట్లు చెబుతాడు మిడతలు అగ్నిలోకి దూకినట్లు అందరు జీవులూ భగవంతుని నోట్లో ఉన్న అగ్నిలోకి దూకి నాశనము చెందుతున్నారు. ప్రపంచమంతా ఆక్రమించి అన్ని తానే అయి భగవంతుడు ఉన్నాడు.

ఎప్పుడైతే ధర్మము క్షీణిస్తుందో ఎప్పుడైతే అధర్మము పెరుగుతుందో అపుడు భగవంతుడు తన మాయా మూలాన్ని మనుష్యునిగా అవతారమెత్తి అధర్మాన్ని ఖండించి, ధర్మాన్ని పునరుద్ధరిస్తున్నాడు.

లోకములో ఆదిలోనే భగవంతుడు ప్రజలకు చెప్పాడు. మనుషులు నిర్వర్తించవలసిన ధర్మము, కాలము గడిచాక ధర్మము క్షీణించి భగవంతుడు చెప్పినది మరిచిపోయి, ప్రజలు అధర్మాన్ని పాటించడము మొదలు పెడుతున్నారు. మళ్ళీ ధర్మాన్ని పునరుద్ధరించడానికి భగవంతుడు అవతారము ఎత్తుతాడు

## జీవితము

తిండిలేని వాళ్ళకు తిండి దొరికితేచాలు. తిండి ఉన్నవాళ్ళకు బట్టలుకావాలి. బట్టలున్న వాళ్ళకి ఉండడానికి చోటుకావాలి లేనివాడికి ఆకలి. ఉన్నవాడికి అజీర్ణము. కోరికల్ని చంపుకోవడము కన్న కోరికలు లేకుండా ఉండడము మంచిది. ఒక కోరిక తీరేక ఇంకో కోరిక వస్తుంది. కోరికల్ని బలవంతముగా చంపుకొని విషయాల్ని గురించి ఆలోచిస్తూ ఉండేవాడు నికృష్టుడు. కోరిక లేకుండా ఉండడము చాలకష్టము మనిషి ఆధునిక కోరికలు సంభవిస్తాయి. అలాగా ఆత్మ నిగ్రహము ఏర్పరుచుకోవడము మోక్షానికి సోపానము.

కోరికలు సంభవించేవి తన చుట్టూ ఉన్న మనుష్యులనుచూసి, వాళ్ళకి ఉన్నవని కొంత ఏడుపూ మనకిలేదని కొంత ఏడుపు.

జీవితము రకరకాల సంఘటనలతో ఏర్పడుతోంది. మరుక్షణము ఏమి జరుగుతుందో ఎవరు చెప్పలేదు. మనము సక్రమముగా ఆలోచిస్తే తప్ప, జీవితము ఒక చక్రములా నడుస్తుంది. పొద్దునే లేవడము ఫోంచెయ్యడము, ఆఫీసుకు వెళ్ళడము, ఇంటికి రావడము ఇదంతా యాంత్రికముగా జరుగుతుంది. ఈ సుడిగుండము నుండి తప్పించు కోవడము భగవంతుని కృపవలన తప్ప జరుగదు.

## ప్రపంచము

పంచభూతాలలో ఉన్నది ప్రపంచము. భూమి, నీరు నీడ, గాలి, ఆకాశము, ఈ అయిదూ పంచభూతాలు, వీటిని అనుభవించేవి పంచ గుణాలు స్పర్శ, వాక్కు, శ్రవణము వాసనచూడడము, రుచి చూడడము ఇవి గుణాలు. చెవి, నోరు, ముక్కు,కళ్ళు, చర్మము ఇవి పంచేంద్రి యాలు.

ఈ అయిదింటి సమూహము జీవి ఎక్కడనుంచి వస్తాడో తెలి యదు. జీవి ఎక్కడకు వెడతాడో తెలియదు.

అవిభక్తమైన భగవంతునికి విభక్తమైన ప్రపంచములో కని పిస్తాడు. భగవంతునికి నామరూపాలు లేవు. ప్రపంచంలో ప్రతిదానికి నామరూపాలు ఉన్నాయి. నామరూపాలు కాని, అవిభక్తమైన భగ వంతుడు నామరూపాలు కల విభక్తమైన ప్రపంచములో కనిపించడము మాయ.

ఈ మాయ ఒక తెరలోనిది. తెరతొలగిస్తే కళ్ళకు కప్పిన పొర్లు పోయి, నగ్నమైన ప్రపంచాన్ని చూస్తాము. భగవంతుడు, శ్రీమతి నగ్న

స్వరూపములు ఒకటే. ఈ కళ్ళలో మనము భగవంతుని చూడలేము.

భగవంతుడు ఈ ప్రపంచాన్ని తన లీల కోసము సృష్టించాడు.

## ధర్మము

ఏ మనిషి పనిచెయ్యకుండా ఉండలేడు. కూర్చోవడము, నించోవడము, నడవడము, ఊపిరి పీల్చడము ఎంత సన్యాసులైనా చెయ్యవలసిందే. తను ఏపనిచేస్తున్నా దాన్ని భగవదర్పణము చెయ్యడమే కర్తవ్యము, దానిలో కర్మలు అంటవు. తామరాకులో నీటి బొట్టులా అంటీ అంటనట్లుండడము మంచిది.

ప్రతి మనిషికి సహజమైన ధర్మము ఉంటుంది. తన ధర్మము తాను చెయ్యలేకపోయినా ఇంకొకళ్ళ ధర్మము చెయ్యగలిగినా, తన ధర్మము మానకూడదు.

చేసేపనులను బట్టి మనుసుల జాతులుగా ఏర్పరచాడు భగవంతుడు.

తెల్లవారికి, నల్లవారికి మధ్యనున్న అంతరాలలాగే జాతుల కలయిక భగవంతుని కిష్టములేదు. అయితే ఈ జాతులు మనుష్యుల సహజమైన గుణాలు బట్టి ఏర్పరిచాడు భగవంతుడు. అందుకనే బోయి జాతిలో పుట్టినా వాల్మీకి మహర్షి అయ్యాడు. భారతములో మాంసాన్ని అమ్ముకునే ఛండాలుడు ఒక బ్రాహ్మడికి జ్ఞానము ధర్మము చెప్పాడు. జాతులు వేరైనా, అందరిలో అన్నిటిలో భగవంతుడు ఉన్నాడు.

## సన్యాసము

పనిచెయ్యకుండా పొట్ట నింపుకోవడము హేయ్యము. సంఘానికి ఉపయోగము లేకుండా పారతంత్రిక జీవితము గడపడము నికృష్టము.

పని అంటే సంఘానికి ఉపయోగించేవి మానవసేవ మాధవసేవ. సంఘానికి చీడపురుగుల్లా పట్టుకుని పిత్రార్జితము అనుభవించేవాడు దొంగ.

మనము సంపాదించేది భగవంతునికి తోటి మనుష్యులకూ అర్పించి శేషాన్ని భుజించేవాడు ఉత్తముడు. అట్లా పంచకుండా తనే తినేసేవాడు దొంగ.

సంఘములో చాకలి బట్టలు ఉతుకుతాడు. దర్జీ బట్టలు కుడతాడు. మంగలి క్షవరము చేస్తాడు పనిమనిషి ఇంట్లో గిన్నెలు తోముతుంది.

సంఘానికి మనము ఋణపడి ఉన్నాము. సంఘముయొక్క ఋణము డబ్బుతో తీరదు. సంఘానికి ఉపయోగించే పనే సంఘానికి ఋణము తీర్చుకునే మార్గము.

మాతృ ఋణము తల్లి తలకు కొరివి పెడితే తీరుతుంది. పితృ ఋణము పెళ్ళి చేసుకుంటే తీరుతుంది. పిల్లల బాధ్యత తీరాక భార్యకు ఆస్తి ఇచ్చేసి భగవంతుని కోసము వెతకడము సన్యాసము. కోరికలేమీ మిగలనివాడు సన్యాసానికి అర్హుడు.

## సంఘము

ప్రకృతి పురుషుల కలయిక వలన ప్రపంచము పుడుతోంది. ప్రకృతి పురుషుడు ఇద్దరూ శాశ్వతం. ప్రకృతి తల్లి, పురుషుడు తండ్రి.

చిన్న బిడ్డ పుట్టగానే తన కాళ్ళమీద తాను నిలబడలేడు. తల్లి అవసరము, తండ్రి అవసరము ఉంటుంది. ఆడపిల్లయితే 18 ఏళ్ళదాకానూ, మగపిల్లవాడయితే 21 ఏళ్ళ దాకానూ ఆధారపడతారు.

సంఘమనే వ్యవస్థ ఈ రీతిగా పిల్లల సంరక్షణ కోసము ఏర్పడింది తల్లి, తండ్రి మాత్రమే కాక, సోదరులు, సోదరీమణులు, ఇతర బంధువులూ దర్జి, చాకలి, మంగలి, ఏదైనా పొట్టపోసుకోడానికి పని, చుట్టుపక్కల వాళ్ళలో సంబంధాలు, ఇవన్నీ సంఘానికి చెంది ఉంటాయి.

సంఘములో ఉన్నవాళ్ళు సంఘానికి కట్టుబడి ఉండాలి. నియమాలను ఉల్లంఘిస్తే సంఘము ఊరుకోదు. సంఘానికి సంబంధించిన శాసనాలను కూడా ఆచరించాలి కాకపోతే సంఘరక్షణ వృదాగా ఏర్పరచిన ప్రభుత్వము ఊరుకోదు.

## పరమాత్మ

ఎవనిచేత ఈ ప్రపంచము తన నుండి సృష్టింపబడిందో ఎవనిచేత ఈ ప్రపంచానికి స్థితిగతులు ఏర్పడి ఉన్నయో అట్టి పరమాత్మకు నమస్కారము.

పుట్టేటప్పుడు మనిషికి వ్యక్తిత్వము లేదు. చచ్చాక మనిషికి వ్యక్తిత్వము లేదు బతికున్న నూరేళ్ళు మాత్రమే మనిషికి ప్రత్యేకత ఆ వయస్సును భగవన్నామ సంస్మరణములో కాకుండా ప్రాపంచిక విషయాలకు వినియోగిస్తే జీవితము వృధా.

హో భగవంతుడా నీ గురించి ఏమీ తెలియదు. నువ్వున్నావని మాత్రము తప్ప ఏమి చెయ్యాలో, ఎటుల చెయ్యాలో తెలియదు అందుకని

నీమీద భారము వేస్తున్నాను. నాకు శక్తిలేదు అందుకని నీమీద ఆధార పడి ఉన్నాను.

భగవాన్! నీ నుండి వేరైన ఈ కొద్ది సంవత్సరాలూ నాకు యుగాలుగా ఉన్నాయి.

స్వామి! నాకు భక్తి నియ్యి చచ్చాక ఏమవుతుందో తెలియదు. నేను దుష్టుణ్ని నన్ను నీలో చేర్చుకో.

సంఘానికి వ్యతిరేకముగా బతకలేము. అన్నిచోట్లా ఆక్రమించి ఉన్న ఆ పరమాత్మకు నమస్కారము.

## బంధము

బంధము, మోక్షము ఒకటి కొకటి వ్యతిరేకము, శారీరకముగా బంధము ఉండకపోవచ్చు, మానసికముగా బంధాలు ఉంటాయి. భార్యా భర్త, పిల్లలు, మనుష్యులు వీళ్ళకు మనిషికి ఉండే బంధాలు మానసికమైనవి. వీటిని వదిలించుకోలేకపోతె మనిషికి మోక్షము దొరకదు.

ఈ ప్రపంచము అంతా బాధలతో నిండి ఉన్నది కాదు. శరీరానికి సంబంధించినంతవరకూ తల్లి, తండ్రి సోదరులు, స్నేహితులు, వీళ్ళనుంచి బంధము ఉంటుంది.

ఈ బంధాలు శరీరముతోటే పుడతాయి. మనిషికి శరీరము ఉన్నన్నాళ్ళు ఉంటాయి. శరీరము పోయాక ఉండవు.

కానీ మనిషి తన్నుతాను ఈ ప్రపంచాన్నుంచి తప్పుకోలేకపోతే ఈ ప్రపంచములో బంధాలు తెంచుకోలేకపోతే మనస్సును ఈ ప్రపంచము నుంచి మళ్ళించుకోలేకపోతే పునర్జన్మ తప్పదు.

ఈ ప్రపంచము దుఃఖ భూయిష్ఠము. ఉన్న కొన్నాళ్ళు, నవ్వుతూ, నవ్విస్తూ సరదాగా జీవితము గడిపేస్తూ, తామరాకు మీది నీటిబొట్టులా ఉండాలి.

## సత్యము

సత్యమేవ జయతే నిజము నిలకడమీద నెగ్గుతుంది. చెడ్డతనము చాలా తొందరగా నెగ్గుతుంది. కాని చెడ్డతనము వలన ఏర్పడిన మార్పు మంచితనము వలన ఏర్పడిన మార్పులాగా శాశ్వతముకాదు. మంచి వాడు తాత్కాలికముగా వోడిపోయినా చివరకు నెగ్గేది మంచివాడే. కొంచెము చెడ్డతనము మంచిది. మరీ చెడ్డతనము ఎక్కువైతే హిరణ్య కశిపుడిలా తయారవుతాడు.

సత్యము అంటే ఉన్నదాన్ని గురించి చెప్పేది. ఈ ప్రపంచము ప్రతిక్షణము మారుతోంది. శాశ్వతము కాదు. ఈ క్షణములో ఉన్నది మరోక్షణములో ఉండదు. కానీ ప్రపంచానికి వెనకాల ప్రపంచానికి మూలాధారము ఉంటుంది. ఇహ అసలైన శాశ్వతమైనది భగవంతుడు.

భగవంతునికి నామ రూపాలు లేవు. అసలు భగవంతుని వ్యక్తిత్వమే అనుమానము. ఎవళ్ళనైతే ఊహించలేము. అట్లాంటి భగ వంతుడు ఉన్నాడని ఎట్లా నమ్మగలము. ఎట్లాగైతే ఇల్లు కట్టడము మనిషి వలన అవుతుందో అట్లాగే ఈ ప్రపంచానికి మూలము భగవంతుడు.

## భగవంతుడు

ఎవళ్ళైతే భగవంతుని గురించి తెలుసుకుంటారో వాళ్ళు ఈ జన్మలోనే ముక్తి చెందుతారు.

మోక్షమనేది భగవంతునిలో కలయిక. ఆత్మ భగవంతుడు వేరుకాదు. ఎవరైతే సత్యము తెలుసుకుంటారో వాళ్ళు ఈ దృశ్యా దృశ్య ప్రపంచములో ఏకత్వము చూస్తారు. ఛండాలుని బ్రాహ్మణుణ్ణి, పనిమనిషిని, పైఅధికారినీ, మట్టినీ, బంగారాన్ని సమంగా చూస్తారు. ఉన్నదంతా భగవంతుడే, ఆ భగవంతుడు తనలో నుంచి మాయద్వారా ప్రకృతిని సృష్టించాడు. భగవంతునిలో కలయిక తెర తొలగిపోయి ఈ అసత్యమైన ప్రపంచము వెనుక సత్యమైన భగవంతుని చూస్తారు. అదే మోక్షము. అదే భగవంతునిలో కలయిక. ప్రాపంచిక విషయాన్ని గురించి పాటుపడేంతవరకూ భగవంతుని గురించి తెలుసుకోనంత వరకూ మనుష్యునకు విజ్ఞాన నేత్రము తెరవలేదు. ఉన్న ప్రకృతే మనుష్యులకు తెలుసు. ఈ దృశ్యా దృశ్య ప్రపంచానికి అతీతుడైనవాడు భగవంతుడు.

ఏ మనిషైనా ఒక్కడు ఉంటే శాసనాలు లిఖితమైన పరంపరగా ఎన్నున్న ఆచారాలైనా అనువర్తింపబడవు. కానీ మనిషి సంఘజీవి. ఒక్కడూ ఉండలేడు. మిగిలినవాళ్ళతో కలుస్తాడు. సంఘములో ఒకళ్ళం ఒకళ్ళమీద ఆధారపడతారు కనుక నియమాలు హద్దులు ఉంటాయి. ఇవి ఉల్లంఘిస్తే మిగిలినవాళ్ళు ఊరుకోరు. సంఘము ఒక పటిష్టమైన వ్యవస్థ దానిలో కొంతమంది ఎక్కువగానూ కొంతమంది తక్కువగాను ఉంటారు. ఎక్కువగా ఉన్నవాళ్ళు ప్రభుత్వము ఏర్పరు స్తారు. శాసనాలు చేస్తారు. ఆ శాసనాలను అమలు పరచడానికి సంఘ ములో కొంతమందిని ప్రభుత్వ సేవకులుగా నియమిస్తాడు. ప్రభుత్వ

అనుయాయులకు కొంత తిండికి వ్యవస్థ మనుగడకు సౌకర్యాలు ఏర్పరుస్తారు. శాసనోల్లంఘిస్తే సాక్ష్యాధారాలు దొరికితే శిక్షిస్తారు. సంఘమంతా ఒక్క తాటిమీద నడిస్తేనే సద్గతి.

## కోరిక

ఎవళ్ళైతే మనస్సులో కోరికలు పెట్టుకొని వాటిని బయటకు పైకి గనబడడానికి వదిలేస్తారో, వాళ్ళు ఆత్మవంచకులు. ఎవళ్ళ స్వభావాన్నిబట్టి వాళ్ళు ప్రవర్తిస్తారు. మనిషి అయాక కోరికలు లేకుండా ఉండరు. వాటిని చంపుకోనక్కర లేదుకూడా కానీ, అన్నింటినీ అనుభవించి కోరికలు కోరడము తప్పు. అవి మనస్సుకు జ్ఞానము తెచ్చుకోవడము ఉత్తమము మనిషి చెడ్డపనులను చెయ్యడానికి ఇష్టపడ కుండా ఇంద్రియాలను ఆధీనములోకి తెచ్చుకుని, తనలోతనేసంతుష్టుడై కోరికలు లేనివాడు శ్రేష్ఠుడు. అన్నిటినీ పరిశీలించి, కోరికలు పనికిరావు, అనుకునేవాడు శ్రేష్ఠుడు. కోరికలను చంపుకోవడము కాదు కావలసినది కోరికలను మనస్సులో అభ్యాసముచేత నిగ్రహించి వాటిని గురించి ఆలోచించ కుండా ఉండడము ఉత్తమము.

## ప్రేమ

ప్రేమ అంటే మగవాళ్ళకూ, ఆడవాళ్ళకూ, తల్లితండ్రులకూ, తాతలకూ, ముత్తాతలకూ, మనవలకూ, మునిమనవలకూ. సోదరులకూ, సోదరీమణులకూ, స్నేహితులకూ, ఉండే అభిమానము, అపేక్ష కాదు. భార్య తనకోసమే భర్తను ప్రేమిస్తుంది. భర్త తనకోసమే పిల్లల్ని ప్రేమిస్తాడు. తల్లి తనకోసమే పిల్లల్ని ప్రేమిస్తుంది. సోదరుడు తన

కోసమే సోదరుణ్ణి ప్రేమిస్తాడు. ఈ ప్రపంచాన్నంతటినీ తనకోసమే మనిషి ప్రేమిస్తాడు. తను అనుకునే ఆత్మ అందరిదగ్గరా, అన్నిచోట్లా ఉన్నదే కనుక ప్రతి మనిషిలోను ఉంటే ఆత్మ సర్వత్ర వ్యాపించి యున్న ఆత్మను ప్రేమిస్తుంది. ఎంతో కొంతమందిలో ఒకళ్ళు భగవంతుణ్ణి పూజిస్తారు. ఎంతో కొంతమందిలో ఒకళ్ళు భగవంతుణ్ణి తెలుసుకుంటారు. కానీ భగవంతునికి అందరూ సమానులే. పరమాత్మకూ ఆత్మకూ తేడాలేదు.

## ఆత్మ

ఎవరైతే ద్విధాభావము చెందుతారో, వాళ్ళకూ పునర్జన్మ తప్పదు. ఈ ప్రపంచమంతా పరమాత్మ స్వరూపమైన ఆత్మలో నిలిచి ఉంది. జీవాత్మ, పరమాత్మ వేరుకాదు. మనిషిలో ఉన్న ఆత్మ, రాయి, రప్పలోనూ ఉంది. కాలక్రమేణా జ్ఞానము నశించి ఈ ప్రపంచము తప్ప వేరే ఏమీలేదనే భావన ఏర్పడింది. తిను, తాగు, అనుభవించు రేపేమవుతుందో అన్న ఆలోచన పుంజుకుంది. అలా అని సరదాలు చంపుకోవాలని కాదు. ఇతరులకు హాని చెయ్యని పనులు మనస్సుకు అంటవు. ఏ పనిచేసినా ఆత్మకు అంటవు. ఆత్మ నశ్వరము. ఆత్మ చంపనూలేదు, చంపబడనూలేదు. తనకన్న వేరే పదార్థము లేనప్పుడు ఎవళ్ళు, ఎవళ్ళని వింటాము. ఎవరు ఎవరిని ముట్టుకుంటారు. ఈ ప్రపంచమంతా తనే అని తెలుసుకున్నవాళ్ళు జ్ఞానులు.

## ప్రేమ

అనుగ్రహానికి పాత్రులైన వారు ఆ అనుభవాల్ని ప్రకటిస్తే

